# హరి, వంగ వన్నె క్రేయాన్



జంతువులు, జంతువులు, జంతువులు!



హరికి నిద్ర పట్టటం లేదు,
దాంతో అతడు తన
బొమ్మ జంతువులు తీశాదు.



జంతువులు ఎంతో సంతోషంగా

ఉంటాయని అనుకున్నాడు హరి.



ఏ జంతువునైతే బాగుంటుంది

అని హరి అనుకున్నాడు.



జంతువుల గురించి మరింత

తెలుసుకోవాలని హరి అనుకున్నాడు.

వంగ వన్నె క్రేయాన్ తీసుకుని అతడు

తన సాహస యాత్రను మొదలుపెట్టాడు.



పెద్దగా, బలంగా ఉంటే బాగుంటుందని

హరి అనుకున్నాడు.

తన క్రేయాన్ తీసుకుని ఏనుగుని గీశాడు.

ఏనుగు తన తొండాన్ని

నీటి బక్కెట్టులో ముంచింది.

తరవాత నీటిని పైకి చిమ్మింది.



అదెంతో సరదాగా అనిపించటంతో

నీళ్ల పైపుని తెచ్చాడు హరి.

అది మెలికలు తిరుగుతూ అతడి చేతిలో నిలబడలేదు.

దాంతో పొరపాటున ఏనుగు మీద నీళ్లు పడ్డాయి.

ఏనుగు మొత్తం తడిచిపోయింది.

పొరపాటు జరిగిందని చెప్పటానికి హరి ప్రయత్నించాడు.

కానీ ఏనుగు అక్కడి నుంచి వెళ్లిపోయింది.



దూర ప్రయాణాలు అంటే నాకు ఇష్టం,

అనుకున్నాడు హరి.

అందుకని ఒంటెను గీశాడు.

తరవాత, ఆహారం, నీళ్లతో ఒక పెద్ద సంచిని గీశాడు.

ఒంటెతో కలిసి హరి

ఎడారి గుండా ప్రయాణం చెయ్యసాగాడు.



నడుస్తున్న హరికి వీపు మీద సంచి బరువుగా

అనిపించసాగింది.

అతడు అలసిపోయాడు.

సూర్యుడు మండిపోతున్నాడు.

నీటి మడుగుని, ఖర్జూర చెట్టుని గీశాడు హరి.



హరి విశ్రాంతి తీసుకుంటూ ఉండగా

చిరుతపులులు పక్కనుంచి పరిగెత్తుకుంటూ వెళ్లాయి.

వేగంగా పరిగెత్తటం నాకు కూడా ఇష్టం, అనుకున్నాడు హరి.

రోలర్ స్కేట్స్ గీసి, చిరుతపులుల తోపాటు

పరిగెత్తసాగాడు హరి.



చిరుతపులులతో పరిగెత్తటం బాగుంది,

కానీ కొంతసేపటికే హరి చెమటలు కక్కసాగాడు.

చల్లగా ఉన్న చోటుకి వెళ్లాలని అతడికి అనిపించింది.

క్రేయాన్‌ని తీసుకుని ఆకాశంలోకి

ఒక గీత గీశాడు హరి.

ఒక మంచు కొండమీద అతడు ఉన్నాడు.



పెంగ్విన్ల గుంపు ఒకటి హరికి కనిపించింది.

వాలులో, పొట్టమీద అవి కిందకి జారుతున్నా .

నాకు కూడా అలా జారాలని ఉంది, అనుకున్నాడు హరి.

దాంతో అతడు స్లెడ్జ్ బండి గీశాడు.



హరి తోపాటు దాని మీదకి చాలా పెంగ్విన్లు దూకాయి.

పెంగ్విన్లతో స్లెడ్జ్ నిండిపోయింది.

కొండవాలులో వాళ్లంతా జారుతున్నారు.

అంతలో దభేలుమంటూ,

వాళ్లంతా మంచులోకి పడిపోయారు.



హరి మంచుతో నిండిపోయాడు.

అతడు చలికి ఒణుకుతున్నాడు.

అతడు ఆకాశంలో పెద్ద సూర్యుడిని గీశా .

దాంతో హరి మళ్లీ వెచ్చబడ్డాడు.

అతడు ఒక అడవిని గీశాడు.



చెట్ల తీగలలో కోతులు ఆడుకుంటున్నాయి.

నాకూ ఉయ్యాల ఊగాలని ఉంది,

అనుకున్నాడు హరి.

పైకి ఎక్కి అతడు ఒక తీగను అందుకునా .

అచ్చం కోతుల లాగా ముందుకీ, వెనక్కీ ఊగాడు.



జంతువుల లాగా ఉండటం సరదాగా ఉంది.

కానీ తన లాగా ఉండటమే హరికి ఎంతో ఇష్టం.

క్రేయాన్ తీసుకుని తన గది కిటికీని హరి గీశాడు.



తన గదికి చేరుకున్న హరి దుప్పటి కప్పుకున్నాడు.

అతడికి ఇష్టమైన కుక్క బొమ్మని చేతులలోకి తీసుకున్నాడు.

వంగ వన్నె క్రేయాన్ నేల మీదకి జారింది,

అతడు నిద్రలోకి జారుకున్నాడు.

అమ్మ పుట్టిన రోజున ఆమెకు హరి ఏమి ఇస్తాడు?



**అయిపోయింది**